# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 ఏప్రిల్ 1979 సంచిక 4

## విషయానుక్రమణిక



---

**చందాదారులు గమనించండి !**

**మీ** చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు **ఉన్నదో** మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రిక పైనున్న విలాసము గల కాగితము **లోనూ తెలుపుచున్నాము.** దానినిగమనించి, ఆ నెంబరు **"..../-5-79"** అనియుండిన, మీ చందా మే **నెలలో** అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా **(సం॥నకు రూ. 6)** ఏప్రిల్ నెల 30 వ తేదీ 1979 **లోపల** పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు **పంపవలెను.**

-: శ్రీవారి కార్యక్రమములు :-

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

---

**సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.**
**వివరములకు అట్టలోపలి భాగములో చూడండి.**




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

మానవాభ్యుదయమునకు, మానవ పరమావధికి మార్గము చూపుటకు మతము అత్యవసరము. మతము జీవునకు దేవునకు మధ్యగల సంబంధ బాంధవ్యమును సూచించును. రెండు కొండల మధ్యనున్న గొప్ప ప్రవాహమును దాటుటకు వంతెన యెట్టిదో జీవుడను పర్వతము నుండి దేవుడను పర్వతమునకు పయనముచేయునపుడు ప్రకృతి అనునది గొప్ప ప్రవాహము, ఆద్యంతములు లేని ప్రవాహమును దాటుటకు మతము భద్రమైన వంతెన, వంతెనలు భిన్న భిన్నముగా వుండునటుల మతములు కూడను భిన్నభిన్న రూపములలో వర్ధిల్లుచున్నవి. భారతదేశమున వర్ధిల్లునట్టి మతమునే సనాతన మతమని పిలుతురు, అనగా ఈ మతమునకు ఆది తెలియనందున సనాతనమతమనబడెను. ఇది ఆది అంత్యములులేని వేదములనుండి వెలువడినది. కనుక దీనినే వేదమతమనికూడా చెప్పిరి. దీనినే ఆర్యమతమని కూడా పిలిచిరి. ఈమతమునకు కర్త ఎవరని అనేకమంది అనేక విధముల పరిశోధనలు సలిపిరి. నేటికినీ ఆ కర్త అంతుపట్టలేక పోవుచున్నారు, అసలు పట్టలేరు కనుక ఇక మాచేత కాదని ఈ పవిత్ర సనాతన మతకర్త, వేదకర్తయే అని నిర్ణయించుకొనిరి. వేదకర్త పరమేశ్వరుడగుటచే ఆర్యమతకర్త పరమేశ్వరుడే అని స్థిరము చేసికొనిరి. కాన ఈ మతము దైవకృతము. లోకములో అనేక మతములు కలవు. అన్ని మతములూ పవిత్రములే. అన్ని మతములూ

దివ్యములే, కాని ఇతర మతములు దైవ కృతములు కావని చెప్పక తప్పదు. యెట్లన వక్కొక మతమునకు వక్కొక దైవదూత అన బడు కర్త మనకు కనుపించుచున్నాడు. వారినే మానవాగ్రగణ్యులని కూడనూ చెప్పవచ్చును. బుద్ధుడు, యేసుక్రీస్తు, జోరాష్ట్రియా, మహమ్మదు, ఇత్యాది జాతికి సంబంధించిన మహనీయుల పేరులూ వెలసినవి, వీరల సిద్ధాంతములు, ఆశయములు, భావములు, వారల నామకరణమున వారివారి మతములుగా పరిగణించబడు చున్నవనుటలో సత్యము లేక పోలేదు. ఎట్లన ఆదర్శ మానవాగ్రగణ్యు డనుపించుకున్న దైవదూత యేసుక్రీస్తు వలన సంభవించిన దగుటచే దీనిని క్రీస్తు మతమని, దీనికి క్రీస్తు నామమును పెట్టిరి. బుద్ధుని వలన ఆవిర్భవించిన దగుటచే దీనికి బౌద్ధమతమని అతని పేరు పెట్టిరి. దైవదూతగా వచ్చిన మహమ్మదు ఆశయము లను, సిద్ధాంతములను అనుసరించుటచేత దానికి మహమ్మదీయ మతమని పేరుపెట్టిరి. కనుక ఇట్టివానిని ఆదర్శ, అగ్రిగణ్య మానవ కృతము లనుటలో దోషములేదు.

దైవబుద్ధి సమగ్రము, సర్వజ్ఞము, మానవ బుద్ధి కొంత హద్దులో యిమిడి యున్నది. కించిజ్ఞమని పిలువవచ్చును. అన్ని మత గ్రంథములునూ వక్క విషయమునే చెప్పి ననూ, మార్గములు వేరువేరుగా నిరూపించుటచే పలు మతములకు తావేర్పడినది. పలు మతము లుండుటచే వారివారి సిద్ధాంతములు వేరువేరుగా ఋజువు జరుపుచున్నవి. రామ, క్రీస్తు జోరాష్ట్రియా, బుద్ధ, మహమ్మదు, ఇవన్నియు వక్కటి అని చెప్పిన చెల్లదు.

ఈ శబ్దములు వకే వస్తువును తెలుపు చున్నవి. యేసుక్రీస్తు మతమున జీవులను సృజింపబడెను అని వున్నది. అల్లా జీవులను సృజించెనని యున్నది. అటులనే జోరాష్ట్రియా బుద్ధ మతములు కూడా ఇంచుమించు ఇటులనే తెలుపుచున్నవి. అయితే వేదమతము దీనికి భిన్నంగా చెప్పుచున్నది. జీవుడు నిత్యుడు. దేవునియొక్క యునికి యీ జీవుని యొక్క యునికికి సంబంధించి యున్నది? జీవుడే లేకుండిన దేవుడే లేడు అని నొక్కి చెప్పు చున్నది. ఇతర మతములవారు ఇప్పుడిప్పుడే ఈ సత్యాన్ని గుర్తించుచున్నారు. పూర్వజన్మ, మీదు జన్మలమధ్య ప్రస్తుత జన్మము బిగించ బడినది. ఉత్తరగతికి ఈ జన్మము పునాదిగా నిర్వచింపబడినది. ఈ విషయమునే వైదిక మతమునందు సూచన ప్రాయంగా చెప్పు చున్నది. పూర్వాపర జన్మల ప్రసక్తి ఖచ్చిత ముగా తెలుపబడెను. కానీ ఇతర మతములలో ఈ పూర్వాపర జన్మలగురించి అంతగా తెలుప బడలేదు.

వైదిక మతములో ఉదయము మొదలు రాత్రి పరుండు వరకూ తీరుబడిలేక చేయ వలసిన కర్మకాండను విధించియున్నారు.

అందులో యజ్ఞ, యాగ, క్రతువు లాదిగా గల ప్రక్రియలను విధించిరి. ఇంతటితో విడువక మానవ గర్భమందున్న శిశువునకు తగిన సంస్కారములు మొదలుకొని మృత్యువు, తదుపరి తిరిగి పరలోక ప్రాప్తి కలుగుట వరకూ కర్మకాండలను కల్పించిరి. ఇట్టివి ఇతర మతము లందెందునూ కానరాదు. కనుక అన్ని మతములూ వక్కటే అనుట చెల్లదు. హైందవమతము ప్రత్యేక ప్రక్రియలను శాసించి నందున సర్వమతములు, విధులూ వక్కటే అన్నది వప్పుకున్నది. ఇట్టి కర్మ సిద్ధాంతములకు భక్తి, జ్ఞాన యోగములే పునాదులు. ఈ మతమను మహా వృక్షమునకు కూకటి వేరు ధర్మము. ఇవన్నియూ మార్గ భేదములేకానీ విజాతీయములు కావు. ఇందులో వైరాగ్యాదులు పత్రపుష్పములు, అందుండి జనించు ఫలమే జ్ఞానము. ధర్మమను కూకటి వేరు భక్తి అను జలముద్వారా పోషింప బడు చున్నది.

ఈ పై వ్యవహారములో యే ఇబ్బంది కలిగిననూ అనగా యెట్టి నీమము తప్పిననూ జ్ఞాన ఫలము దెబ్బతినును. ఇది హైందవ శాసనము. ఇట్టి ప్రణాళిక కూడా మరే మతము ననూ కానరాదు. ప్రాచీన ఋషులు స్వాను భవముతో శోధించి, మధించి అందించిన సుధారసము హైందవ మతము. అంతేకాని యేదో బజారులో అమ్మబడు పదార్థములవలె మతములను యేరుకొని నిర్ణయించినది కాదు. స్వీకరించినది కాదు, మతములు జన్మతః యేర్పడినవి. యెవరికి నచ్చిన మతమును వారు స్వీకరించుటకాదు. ఇట్లు తలంచుటలో మతము నకు స్థానమేలేదు. మూడునాళ్ళ జీవితమే అయిన నీతినియమాలెందుకు? జీవితము మూడునాళ్ళ ముచ్చటకాదు. సుదీర్ఘమయిన ప్రయాణము జీవితము. మతమనునది ప్రస్తుతమునకు ఉప శాంతి. ముందునకు ప్రోత్సాహ ఉత్సాహము లను పురికొల్పునదై యుండవలెను. వెనుక చేసిన కర్మఫలమును ఇప్పుడు అనుభవించు చున్నామనియు ప్రస్తుత పరిస్థితితో సమాధాన పడుటకు ఉపశాంతి. ఇప్పుడు మంచి కర్మ లాచరించిన మంచిమంచి ఉత్తమ జన్మము అందుకొందురనునది ఉత్సాహ ప్రోత్సాహము, ఈ రెండు భావములతో జీవితమును మిళితము చేసినపుడే, అట్లు చేయువారలకే నీతి నియమాదు లకు స్థానముండును. నీతి నియమాదులను సవ్యముగా నడుపగలశక్తి. సమాధాన, ప్రోత్సాహ, ఉత్సాహములలోనే యున్నది. మతమునకు మొదలు యేది, కొనయేది? అనునది చెప్పుటకు వీలుకాదు. అటులనే జీవు లకు మొదలిది, కొనయిది అని చెప్పుటకు సాధ్యముకాదు. అంతే కాక హైందవమతము సిద్ధాంత ప్రకారము జీవుడు అనాది, ప్రస్తుత జన్మమెత్తుటకు పూర్వ సంస్కారమే కారణమై యున్నది. అంతేకానీ దేవుని విలాసముల నిమిత్తమో లేక యే ఆగ్రహ అనుగ్రహముల

వలననో ఈ జన్మ లభించినదని తలంచరాదు. అని సనాతన హైందవ మతము చాటుచూ వచ్చుచున్నది.

మరొకటి; ధర్మార్థ కామ మోక్షములనబడు పురుషార్థములలో మోక్షమను దానిని పలు మతములు పలు రీతులుగా వర్ణించుచున్నవి. కానీ, ఇతర మతములలోని యే యొక్క సత్యమో లేక సిద్ధాంతమో హైందవమతమున వుండినంత మాత్రమున రెండు మతములూ వక్కటే అని చెప్పుట అసంభవము, కొన్ని కొన్ని సిద్ధాంతములు అన్ని మతములందునూ కనుపించవచ్చును. ఆయా విషయములు మాత్రము 'వక్కటి అగునేమోకానీ అన్ని సిద్ధాంతములూ ఏకంగా వుండవు. ఆదియైన అనాదియైన హైందవ మతము అన్నిటికంటే మిన్న.దీనినుండియే మిగిలిన మతములు కొన్ని సిద్ధాంతములను యెన్నుకొని యుండవచ్చును. ఇతర మతములలో నున్నవారికి వారి వారి సంస్కారవశమున హైందవ మతమునందలి సత్యము స్ఫురింపవచ్చును. లేక, ఇది మంచి దని అంగీకరించ వచ్చును. అంత మాత్రము చేత ఆ మతము, ఈ మతము రెండూ వక్కటే అని చెప్ప సాధ్యముకాదు. ఈ సత్యాన్ని గుర్తించుటలోనే హైందవ సాంప్రదాయము సాగి వచ్చుచున్నది.

నీలోలేని తప్పులకు ఎవరే మన్ననూబాధపడకుము. నీలోఉన్న తప్పులకు ఇతరులతో అనిపించుకొనకమునుపే వానిని సరిచేసికొనుటలో నీలో నీవు ప్రయత్నించు. నీ తప్పులు నీకు తెలుపువారిపై నీవు కోపముకాని, ద్వేషముకాని పూనక - 'నా తప్పులు తెలిపిరే' అని తెలిపినవారిలోవున్న తప్పులను వెతుకక - తెలిపినవారికి కృతజ్ఞత చూపు. అట్లుకాక, వారి తప్పులను వెతికి తెలుపుటలో, మరింత నీదే తప్పగును. నీ తప్పును నీవు తెలిసికొనుటలో మంచియున్నది కాని, నీ తప్పు చెప్పినవారి తప్పులు వెదకుటలో ఏ మంచీ లేదు. దానివలన ఏఫలమూ ఉండదు.

# ఆనంద పొంగలి

శ్రీ భగవాన్ ప్రేమ స్వరూపులు. సంక్రాంతి పండుగ తమిళనాడు భక్తులకు శ్రీ స్వామి అనుగ్రహాన్ని ప్రసాదించింది. ఉత్తరాయణ పుణ్యకాలం లేదా మకరసంక్రాంతి తమిళనాడులో పొంగల్ పండుగగా సమధికోత్సాహంతో జరుపుకొంటారు. ప్రజల హృదయాలను అలరించే జాతీయ పండుగ ఇది. అందుకే శ్రీ స్వామి ప్రత్యేకానుగ్రహంతో ఈ పండుగరోజులు మద్రాసులో గడప నిశ్చయించుకోవడం అక్కడి భక్తులకు నిజంగా మహా పర్వదినం అయింది. తమిళనాడు శ్రీ సత్యసాయి సేవా సంస్థల వారు బాలవికాస్, తదితర కార్యక్రమాలకు భారీ ఎత్తున ఏర్పాట్లుచేసి, కార్యకర్తలకు శ్రీ భగవాన్ ఆశీస్సులు లభించే అవకాశం కలిగిందారు.

జనవరి 14వ తేదీ పొంగల్ పండుగ రోజున భగవాన్ భక్తుల హృదయాలను కదిలించే అనుగ్రహ భాషణం ఇచ్చారు. సుందరం గ్రౌండ్స్‌లో చేరిన వేలాది భక్తులు ఆనంద పొంగలిగా సాగిన శ్రీస్వామి దివ్యోపన్యాసానికి ముగ్ధులైనారు. పొంగల్ పర్వదినం నాడు పాలు పొంగిస్తారు. మానవులు తమ హృదయాలలో ఆనందాన్ని పొంగించుకోవాలని దీని అర్థం. ఇది గోమాత పండుగ కూడ. మానవులు తమకు అవసరమైన ఆహార పదార్థాలను అనుగ్రహించినవారి పట్ల ప్రత్యేక భక్తి ప్రపత్తులను తెలుపుకోవలసిన సందర్భం ఇది. మానవులు తమ హృదయంలో నిహితమై ఉన్న ఆనందాన్ని పొంగించే బదులు వారి మనస్సులలో భయాందోళనలను పొర్లించుకొంటున్నారు. మానవుడు ఇంద్రియసుఖాల వెంట వ్యర్థమైన పరుగులు తీయడమే ఈ అనర్థానికి హేతు వని భగవాన్ వక్కాణించారు. "లోపలినుంచి పొంగేదే నిజమైన ఆనందం. ఆ ఆనందాన్ని పొంగించుకొని అనుభూత మొనర్చుకోవాలి. ఇట్టి ఆంతరంగిక సాధనలో ప్రతి ఒక్కరు అంకితులు కావాలి. పొంగల్ అంటే ఇదే అర్థం" అని భగవాన్ ఉద్బోధించారు.

15వ తేదీన భగవాన్ రాష్ట్రం నలుమూలలనుంచి వచ్చిన సాయి సంస్థలకు చెందిన వివిధ శాఖల కార్యవర్గ సభ్యుల, జిల్లా అధ్యక్షుల సమావేశంలో ప్రసంగించారు విచారణద్వారా అహంకారాన్ని తొలగించుకోవలసిన అగత్యాన్ని గురించి భగవాన్ తెలియచేస్తూ "అహంకారమే కోపానికి హేతువు అవుతుంది. అదే అనేక అనర్థాలకు దారి తీస్తుంది" అన్నారు. ప్రతి కార్యకర్త తనలోను, అంతరంగ సారథిగా తనను నడిపిస్తున్న సాయిలోను మరింతగా విశ్వాసాన్ని పెంపొందించుకోవాలని, ఇట్టి ఆత్మ విశ్వాసాన్ని దృఢపరచుకొన్నవారికి ఆందోళన, ఆశాభంగం, ఓటమి అనేవి ఉండ"వని భగవాన్ తెలియజెప్పారు.

బెంగుళూరుకు తిరిగివెడుతూ భగవాన్ హైదరాబాద్ భక్తులను అనుగ్రహించారు. 29వ తేదీన కొద్దిమంది భక్తులతో కలసి కర్ణాటక రాష్ట్రంలోని దక్షిణ కెనరా జిల్లా మంగుళూరుకు విమానంలో వెళ్ళారు. క్రొత్తగా ఏర్పాటైన శ్రీ సత్యసాయి లోక్‌సేవా ట్రస్టు కేంద్ర

కార్యాలయాన్ని చూడాలన్నదే ఈ పర్యటన ప్రధానోద్దేశం. నైతిక, ఆధ్యాత్మిక సూత్రాలపై నడుస్తున్న సంస్థలకు అపూర్వమైన విద్యా విషయక సముదాయం ఇది. ఈ ట్రస్టు రిజిస్టర్ అయింది. దీని మాతృసంస్థ అలికే అనే ఒక గ్రామంలో నెలకొన్నది. కొండ సానువులలో, పచ్చని కొబ్బరి, పోకతోటల మధ్య గల ఆ గ్రామానికి భగవాన్ ఆగమన భాగ్యం అపురూపమైంది. నిజానికి దక్షిణ కెనరా జిల్లా భక్తులు భగవాన్ దర్శనభాగ్యం ఎప్పుడా అని రెండేళ్ళుగా ఆర్తితో నిరీక్షిస్తున్నారు. భగవాన్ కారులో వేగంగా మంగుళూరునుంచి 30 మైళ్ళ దూరానగల అలికే గ్రామానికి వెళ్ళారు. కొండలమీదుగా వంపులు తిరుగుతూ వెళ్ళిన రోడ్డుపై కారు సాగింది. దారిపొడవునా ఇరువైపులా గ్రామీణ ప్రజలు భగవాన్ దర్శనభాగ్యం కోసం నిండిపోయారు. దారిలో బంట్వాల్ అనేచోట 1500 మంది భక్తిభరిత హృదయాలతో ప్రణమిల్లగా భగవాన్ ప్రశాంత ఉషోదయ సమయంలో కొంత సమయం అక్కడ ఆగి వారిని అనుగ్రహించారు.

అలికేలో భగవాన్‌కు వెయ్యిమందికి పైగా భక్తిప్రపత్తులతో స్వాగతం ఇచ్చారు. ప్రాథమిక, మాధ్యమిక తరగతుల విద్యార్థులు, ఉన్నత పాఠశాల, జూనియర్ కళాశాల విద్యార్థులు, అనాథాశ్రమం విద్యార్థులు, రాష్ట్రం నలుమూలలనుంచి వచ్చిన విద్యార్థుల తల్లిదండ్రులు భగవాన్‌కు జేజేలు పలుకుతూ హార్దిక స్వాగతం ఇచ్చారు. ఎత్తైన కొండకొనపై ప్రత్యేకంగా నిర్మించిన కుటీరాన్ని భగవాన్ అలంకరించారు. అక్కడనే వారు పతాకాన్ని ఆవిష్కరించారు. శ్రీ సత్యసాయి లోకసేవా ట్రస్టు సమావేశంలో వారు పాల్గొన్నారు. సాయంత్రం సుమారు 30 వేలమంది భక్తులు చేరిన మహాసభలో భగవాన్ దివ్యోపన్యాసం ఇచ్చారు. భక్తులు ఆనందాన్ని పంచుకొన్న ఆ శుభ సమయం చిరస్మరణీయమైనది. స్వర్గీయ శ్రీ మడియాల నారాయణభట్ సేవానిరతిని శ్రీ స్వామి ప్రస్తుతించారు. 60 మందికి పైగాగల, దీక్షాబద్ధులైన ఉపాధ్యాయుల నుద్దేశించి మాట్లాడుతూ, విద్యారంగంలో సేవకు తాసూ జీవితాన్ని అంకితం చేశానని చెబుతూ వారిని ఉత్తేజపూరితుల్ని చేశారు. విద్యార్థులు ఈ విద్యాకేంద్రం ఆవరణలో పాఠ్యాంశాలను మాత్రమేకాక, నమ్రతను, భక్తిప్రపత్తులను, నిస్వార్థ సేవాభావాన్ని కూడ నేర్చుకోవాలని భగవాన్ ఉద్బోధించారు. అనంతరం విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలను భగవాన్ తిలకించి, వారిని ఆశీర్వదించారు.

జనవరి 30న స్వామి, భక్తబృందం వెంటరాగా సువిశాలమైన ఆ క్షేత్రంలోని వివిధ విద్యాసంస్థలను తిలకిస్తూ దయతో తగు సూచనలు ఇస్తూ వచ్చారు. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాల బాలుర హాస్టలు, బాలికల హాస్టలు, ఉన్నత పాఠశాల విద్యార్థుల హాస్టలు, చికిత్సా కేంద్రం, ముద్రణాలయం, పోస్ట్ - ఆఫీసు, సహకార స్టోర్సు, హైస్కూలు, జూనియర్ కళాశాల, పశుశాల మున్నగువాటి నన్నింటినీ శ్రీస్వామి తిలకిస్తూ, వెళ్ళిన ప్రతిచోట అవసరమైన సూచనలు, ఆదేశాలు ఇచ్చారు. అక్కడి సముదాయానికి మకుటాయమానమైనది "ప్రేమ్‌కుటీర్" దీక్షాబద్ధులైన ఉపాధ్యాయులు తమ అధ్యయన, సాధన, ధ్యానాదులను "ప్రేమ్‌కుటీర్" లోనే సాగింతుకొంటుంటారు. ఉదయం 11 గంటలకు శ్రీ స్వామి అక్కడ విద్యార్థుల, వారి తల్లిదండ్రుల సమావేశంలో దివ్యోపన్యాసం చేశారు. వరుసలలో ప్రసాదం పంచుతూ ప్రతి ఒక్కరినీ ఆశీర్వదించారు.

శ్రీస్వామి "మడియాల"కు వెళ్లారు. స్వర్గీయ శ్రీమడియాల నారాయణ భట్ గృహం అది. ఆయన

తల్లిగారిని, ఇతర బంధువులను స్వామి ఆశీర్వదించారు. అనంతరం విఠల్ పుత్తూరు వెళ్లారు. పుత్తూరులో భజనమందిరానికి భగవాన్ శంకుస్థాపన చేశారు. అక్కడి నుండి చొక్కడి గ్రామం వెళ్ళి, అక్కడికి వచ్చి చేరిన వేలాదిభక్తులపై శ్రీస్వామి అపారకృపను వర్షించారు. మారుమూలనున్న ఆగ్రామం సాయి కృపతో పునీత మయ్యే భాగ్యానికి నోచుకొన్నది. అక్కడకూడ ఒకభజన మందిరానికి శ్రీస్వామి శంకుస్థాపన చేశారు. భక్తులు శ్రమదానంతో వర్షాలు పడేలోగానే మందిర నిర్మాణాన్ని పూర్తి చేయాలని భగవాన్ సలహా ఇచ్చారు.

తరువాత శ్రీస్వామి మంగళూరు వైపు పయనమైనారు. దారి పొడవునా గ్రామీణులు భజన కీర్తనలతో శ్రీస్వామికి భక్తిప్రపత్తులు చూపించుకోడానికి రావడంతో ప్రతి పది నిమిషాలను భగవాన్‌కారునుఆపి భక్తులకు దర్శనం ఇస్తూవచ్చారు. భక్తితో శ్రీస్వామి దర్శనం సాధించిన సుకృతాత్ములువారు.

మంగుళూరులో శ్రీస్వామి ఉన్నకొద్దిసమయంలోనే అవిరామ కార్యక్రమంలో పాల్గొన్నారు. పది మందికిపైగా భక్తుల గృహాలకు వెళ్ళారు. రాత్రి 11 గంటల ప్రాంతాన మణిపాల్‌చేరుకొన్నారు. ముల్కీలో ఆగిన స్వల్పవ్యవధిలో, తమదర్శనం కోసం సుమారు 15,000 మంది అయిదుగంటలుగా నిరీక్షిస్తుండడం చూచిన స్వామి దర్శనం ఇవ్వకుండా ముందుకు వెళ్ళలేక పోయారు. దాదాపు 20 నిమిషాలసేపు స్వామి వారితో మాట్లాడి భక్తులకు ఆనందం కలిగించారు.

31వతేదీన ఉదయం 10-30 గంటలకల్లా స్వామి మంగుళూరు విమానాశ్రయం చేరుకొన్నారు. ఎయిర్ పోర్ట్ బిల్డింగ్ బయట వరుసలుతీర్చిన భక్తులమధ్యగా నడిచివెడుతూ, వారిని ఆనందనిమగ్నుల్ని చేశారు. ఉదయం 11 గంటలకు బెంగుళూరుకు విమానం ఎక్కారు.

స్వామి ఆగమనంతో దక్షిణకెనరా జిల్లా సంతోషాతి రేఖలను నింపుకొన్నది. అక్కడి ప్రజలలో నిరాశాంధకారాన్ని పటాపంచలు చేసి, సమధి కోత్సాహపు వెలుగులను విరజిమ్మింది. ప్రతి ఇంట ఒక నూతన ఆనందం వెల్లివిరిసింది. నూతనోత్తేజాన్ని పూరించు కొన్నది. శ్రీసత్యసాయి లోక సేవాట్రస్టు, అలికేలో నెలకొల్పిన విద్యాసంస్థల సముదాయం, ఇప్పుడు సాయి విద్యావిప్లవం వెల్లువలోకి వచ్చిచేరింది. అక్కడి అధ్యాపకుల, విద్యార్థుల క్రమశిక్షణ, దీక్షా తత్పరతలు భగవాన్ అనుగ్రహాన్ని ఆకాంక్షించే తదితర విద్యాసంస్థలకు మార్గదర్శకం కాగల వనడంలో సందేహం లేదు.

—ఎడిటర్



# సాయి ధామంలో దివ్యానుభూతి

నేను పొందిన ఒక దివ్యానుభూతి ఇది. శాన్ ఫ్రాన్సిస్కోకు దక్షిణాన శాంతాక్రుజ్ పర్వత సానువులలో 1978 డిసెంబర్ 1–3 తేదీలందు ఒక సత్సంగ శిబిరానికి ఏర్పాట్లు జరిగాయి. ఆ శిబిరంలో ప్రసంగించాలని నాకు ఆదేశం వచ్చింది. వెస్ట్‌కోస్ట్ రీజినల్ సత్యసాయిబాబా సత్సంగ శిబిరంలో నేను ప్రసంగించబోతున్నానన్న భావన నాలో అలౌకికానందాన్ని కల్గించింది. వెయ్యేళ్ల పురాతన చరిత్రను సంతరించుకొన్న టేకువృక్షాలతో నిండిన సుందరమైన అడవుల మధ్య వై. ఎం. సి. ఏ. శిబిర మైదానంలో జరిగే సమావేశంలో నేను ఉపన్యసించాలి.

శిబిర ప్రారంభంనాడే నా ప్రసంగం వుంటుందని శాన్‌ఫ్రాన్సిస్కో సాయిబాబా కేంద్రం నుంచి లీలా పాచ్ ముందుగానే అక్టోబర్‌లో నాకు ఒక లేఖ వ్రాశారు. సాయిధామం (సాయిలెన్స్) అంటే ఏమిటో వివరిస్తూ నేను ఉపన్యసించాలి. శిబిర ఉద్దేశాన్ని గురించికూడ చెప్పాలి. సాయి కేంద్రం అధ్యక్షుడు డాన్‌హిత్ ఆ సమయంలో మరికొంత మంది జిజ్ఞాసువులతో బాబా సన్నిధిలోవున్నారు.

శిబిరానికి హాజరై తీరాలని నిశ్చయించుకున్నాం. అక్కడ చేయవలసిన ప్రసంగంగురించి నేను లోతుగా ఆలోచించలేదు. కొన్నివారాలు గడచిపోయాయి. మన ప్రియతమ భగవానుని పవిత్ర జన్మదినోత్సవం నాడు బాబా భక్తులమందరం సమావేశమైనాము. శ్రీభగవానులే స్వయంగా వచ్చి దర్శనం ఇచ్చినట్లు మేము అనుభూతి పొందాము. మర్నాటి వేకువ జామున పెయిత్, నేను ధ్యానంలో కూర్చున్నాం. సరిగా ఆ సమయంలో బాబా పూర్ణచంద్ర ధామంలో జూలాలో అలరిస్తుంటారని ఊహించుకున్నాం. 50వ జన్మదినోత్సవంనాడు భగవానుడు జూలాలో విరాజిల్లిన సన్నివేశం నా స్మృతి పథంలో మెదిలింది. శ్రీస్వామి దూరతీరాలలో విహరిస్తున్నట్లు అనిపించింది.

మేము ధ్యానంలో నిమగ్నులమైన మరుక్షణంలోనే భగవానుని సన్నిధిలో వున్నట్లు నాకు దివ్యానుభూతి కలిగింది. అంతేకాదు, శ్రీస్వామి మాట్లాడ నారంభించారు. శిబిరంలో నేను ప్రసంగించవలసివున్న ఆ రెండు అంశాల గురించే బాబా స్వయంగా ఉపన్యసిస్తున్నారు.

బాబా మాట్లాడే ముందర, ఓరవాకిలిగా వున్న ఒక పెద్ద ద్వారం ప్రక్కగా నాకు కొద్ది దూరంలో నిలబడ్డారు. వారిలో ఎన్నడూ లేని సంతోషం తొణికిసలాడుతున్నది. వారి మందస్మిత వదనం నన్ను ఆహ్వానిస్తున్నట్లుగా వున్నది. "నీకు లోపలికి రావాలని వుందా?" అని శ్రీస్వామి అడిగారు. లోపలికి అడుగిడడం నాకు తెలుసు. సాయిధామంలోకి నేను చేరుకుంటున్నానన్న అనుభూతికూడ పొందాను. లోపల అడుగు పెట్టగానే మరోలోకంలో తేలిపోతున్నట్లనిపించింది. తిరిగి స్పృహ వచ్చేసరికి నేను ఆ ద్వారం బయట తిరిగి బాబా సమీపాన నిలబడి వున్నాను.

బాబా ఇంకా ఆనందపు చిరునవ్వులు నాపై కురిపిస్తూ "చార్లెస్, మరొకసారి లోపలికి వెళ్ళాలని వుందా?" అని అన్నారు. క్షణం క్రితం జరిగిందేమిటో అప్పుడు నాకు గ్రహింపుకువచ్చింది. ప్రాపంచిక భావనలను నా మనసులోకి రానిచ్చాను. ప్రశాంతమైన సాయి ధామంలోనున్న నన్ను ఆ ప్రాపంచిక భావనలే బయటికి నెట్టివేశాయని తెలిసింది. అవరోధం కల్గిస్తున్న ఆలోచనలన్నింటినీ ప్రక్కకు నెట్టివేసి మరోసారి నేను ఆ బంగారు వాకిలిలో అడుగుపెట్టాను. ఈ సారి దివ్యమైన ఆ సాయిధామంలో నేను వుండిపోగలనని అనిపించింది.

సాయిధామం అంటే ఎలావుంటుందో నాకు నిజమైన అనుభూతిని కల్గించడానికే బాబా ఇలా చేశారని నేను గుర్తించగలిగాను. ఇతరులను కూడ సాయిధామం వైపు నేను నడిపించగల శక్తిని ప్రసాదించడానికే శ్రీస్వామి నాకు ఆ దివ్య పథాన్ని చూపిస్తూ, విచిత్రమైన అనుభూతిని అనుగ్రహించారని తెలుసుకొన్నాను.

సాయి అంటే బాబా చెప్పిన అర్థాన్ని కూడ చూచాను "సా" అంటే "సర్వులు" "అయి" అంటే "తల్లి" అని స్వామి చెప్పారు. సాయి అంటే అందరికీ తల్లి అయిన ఆ జగజ్జనని అన్న అర్థం విదితమవుతున్నది. లోకమాత సన్నిధిలో చేరడమే సాయిధామం (సాయిలెన్స్) అంటే, సాయిధామం పొందే అనుభూతి మహాద్భుతమైనది సాయిమాత సాన్నిధ్యమే సాయిధామం. అదే ప్రశాంతిధామం "సాయిలెన్స్" అనే పదం బాబా కరుణతో నాకు స్ఫురించి చాల సంవత్సరాలయింది. ఆధ్యాత్మిక శిఖరాలను అధిరోహించ గోరే వారికి ఇప్పుడు " సాయిధామం " (సాయిలెన్స్) అనే ఆపదం ప్రశాంతిధామంగా విరాజిల్లుతున్నది.

—చార్లెస్ పెన్
19-12-1978.



# హృదయంలో అనుభూతి చెందే సంస్కృతి

బృహదారణ్యకోపనిషత్తులో (2/5) యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయికి ఒక ఉపదేశం చేస్తారు. తనకు లోపల వెలుపలగల ప్రపంచం అంతటా నిండివున్న మధురమైనఅనుభూతిని ఎంతో ఆనందాతిరేకంతో వర్ణిస్తారు మహర్షి. భూమి, నీరు, నిప్పు,గాలి, సూర్యుడు, చంద్రుడు, మెరుపులు — అన్నింటిలోనూ మధురమైన మధువు నిండివున్నదని మహర్షి బోధిస్తారు. "ఇయం పృథ్వీ, సర్వేషాం భూతానాం మధు, అస్యై పృథివ్యై సర్వేషాం భూతానాం మధు". ఈ ఉపనిషత్ శ్లోకంలో వేదాంత తత్త్వం కంటె కావ్యరసాత్మకమైన సుందర అనుభూతి అధికంగా వుంది ! నిజానికి ఉపనిషత్తులు, ఇంకా వేదాల్లో కొన్ని భాగాలు ఈ మధువిద్య' ను తెలియజేసేవే! అత్యంత సున్నితమైన హృదయంలో అనుభూతి రూపమైన ఈ సంస్కృతి

(Culture of Feeling). బుద్ధిగతమైన వైజ్ఞానిక సంస్కృతికి (Culture of Intellect) భిన్నమైనది.

బుద్ధిగతమైన వైజ్ఞానిక సంస్కృతి ఈనాటి ఆధునిక నాగరికత నిర్మాణానికి మూల భూతమైనది. ఇలాటి ఈ నాగరికత ఇలాగే అనంత కాలాలుగా కొనసాగుతుందా? అనే విషయంలో ఇప్పుడిప్పుడు సందేహం కలుగుతోంది! ఒక శతాబ్దంపైగా పారిశ్రామిక మానవతాదృష్టి (Industrial Humanism) ప్రపంచంఅంతటా అలవడింది. సైన్సు, టెక్నాలజీలతో అధికోత్పత్తిని సాధించటం ద్వారా సర్వతోముఖమైన పురోగతి మనకు లభిస్తుందని అనిపించినా, సైన్సు మీద సాంకేతిక నైపుణ్యంమీద పెట్టుకున్న ఆశలు ఇప్పుడిప్పుడే సన్నగిల్లి పోతున్నాయి! మానవ జాతి సమస్యలకు యంత్రాలు పరిష్కారం ఇవ్వగలవా ? యంత్రం మీద కంటె మనిషి మీద, హేతువాదం మీద కంటె అందుకు అతీతమైన దివ్యత్వం మీద, యంత్రం లాటి మనిషిమీద కంటె చైతన్యం నింపుకున్న వ్యక్తిత్వంమీద ఈనాడు ప్రపంచంలోని జనావళికి ఆసక్తి పెరుగుతోంది. కళ్ళతో చూడకపోయినా హృదయంలో కలిగే అనుభూతి వల్లకూడా సద్యస్ఫురణ లభిస్తుంది అనేది ఒక ప్రాచీన సూక్తి. గట్టిగా వాదించినంత మాత్రాన సత్యాన్ని రుజువు చేయలేం. ఏదో ఒక హేతు బద్ధమైన సూత్రాన్ని కనిపెట్టినంత మాత్రాన కూడా నిజాన్ని తెలుసుకోలేం! సత్యం అనేది వీటికి అతీతమైనది. అది హృదయంలో కలిగే ఆనందానుభూతి. నేడు ప్రపంచ వ్యాప్తంగా వున్న నవీన సంస్కృతీ ఛాయల్లో కూడా ఈ హృదయగతమైన అనుభూతికి స్థానం వుంది. హేతువాద దృష్టి కంటె, తర్క అలంకారాది శాస్త్రసహాయంకంటె ఈ హృదయగత అనుభూతి సత్యాన్వేషణకు ఎక్కువగా తోడ్పడుతుంది.

నిజానికి ఈనాడు ఒక నూతనమైన భాగవతోద్యమం ప్రపంచంలో వ్యాపింపుతోంది. యోగ, జప, ధ్యాన, భక్తి, సేవా, సాధనలు ఈ భాగవతోద్యమంలోని అంశాలు. భగవాన్ సత్యసాయిబాబా ఈ ఉద్యమానికి భారత దేశంలోనూ, భారత దేశంద్వారా మానవాళి అంతటికీ మార్గదర్శకులూ, సంరక్షకులూ అయినారు! స్వామి యొక్క ప్రేమ దీప్తిలో, వేదాలూ ఉపనిషత్తులూ చూపించిన భారతీయ సంస్కృతిలోనూ భగవాన్ సత్యసాయి కళాశాలల్లోని విద్యార్థులు ఈనాడు సుశిక్షితులవుతున్నారు. ఇప్పుడు మనం చెప్పుకున్న "హృదయానుభూతి రూపమైన సంస్కృతిని" పోషించి పెంపొందించటంలో శ్రీసత్యసాయి కళాశాలల విద్యార్థులు మార్గదర్శకులు కాగలరు ! భగవాన్ స్వయంగా సారథ్యం వహించి ఈ భాగవతోద్యమాన్ని ముందుకు నడుపుతున్నారు. అపారమైన భగవాన్ ప్రేమ ఈనాటి యువతరం హృదయాన్ని స్పృశించి త్వరలోనే, అతిత్వరలోనే ప్రపంచాన్ని సరియైన మార్గంలో నడిపించుతుంది.

డా॥ కె. భాస్కరన్ నాయర్, M A.,D.Sc.



# "చంద్ర బింబంలో కనిపించే బాబా"

చందమామ కథలు చిన్నతనంలో ఎన్నో విన్నాను. చందమామలో ఎవరో ఒక వ్యక్తి దాక్కున్నారని ఆ కథల్లో చెబుతారు. ఆ వ్యక్తికోసం బాల్యంలో చందమామలో చూసేవాణ్ణి. అయినా ఆ వ్యక్తి కనిపించేవాడు కాదు.

1975 లో ఒకరోజు సాయంకాలం హవాయ్ సముద్రతీరంలో నేనూ నా సతీమణీ షికారు చేస్తున్నాం. అప్పుడే నేను ఇండియానుంచి తిరిగి వచ్చాను. ఆ విశేషాలు మేము చెప్పుకుంటున్నాము. నా భార్యతో మాట్లాడుతూనే యథాలాపంగా ఒకసారి ఆకాశంలో ఉన్న పూర్ణిమా చంద్రుణ్ణి చూశాను. ఆశ్చర్యం! భగవాన్ సత్యసాయిబాబా చందమామలో నుంచి నన్ను చూస్తున్నారు! అది భ్రాంతి కాదు! ప్రత్యక్ష అనుభవం! నాలోని అత్యంత విస్మయం దాదాపుగా మూర్ఛితుణ్ణి చేస్తోంది! "హసీ! బాబావారు దర్శనం ఇస్తున్నారు. నన్ను నేనే నమ్మలేక పోతున్నాను" అంటూ నా భార్యతో చెప్పాను. "ఎక్కడ చూస్తున్నారు?" అని అడిగింది. చంద్రబింబంవైపు వేలుపెట్టి చూపించాను. ఆమె కూడా అటు చూసింది. "భగవాన్" అంటూ ఆమె ఆశ్చర్యం ప్రకటించింది!

అది పున్నమిరాత్రి. ఆనాటి ఆ అనుభవం చంద్రుణ్ణి చూసినప్పుడల్లా మాకు కనిపించే నిత్య సత్యమైన భౌతిక అనుభవంగా పరిణమించింది. ప్రతి రాత్రీ చంద్రునిలో మాకు భగవాన్ ప్రత్యక్షం అవుతూ అదృశ్యులవుతున్నారు! అది మాకొక నిరంతరమైన ఆనందానుభూతినిచ్చే దృశ్యం! పూర్ణిమ రాత్రుల్లో చంద్రబింబం ఉదయించి ఆకాశంలోపైకి వచ్చి మాకు ముఖాముఖి కనబడుతూ ఉండగా, అందులో బాబా స్వరూపం ఎంతో సుందరంగా కనిపించుతూ ఉంటుంది! యునైటెడ్ స్టేట్సులో కూడా కొన్ని వేకువవేళల్లో చందమామలో భగవాన్ బాబా తమ దివ్యతేజోమయ సందర్శన భాగ్యం మాకు కలిగిస్తూనే ఉన్నారు. చందమామ పై భాగంలో స్వామి జుట్టుచుట్టూగల శివలింగాకృతి కనబడుతుంది! మిగతా భాగంలో స్వామి రూపం అంతా ఉంటుంది. ఆదృశ్యంలోని విస్పష్టత ఎదుటి వాతావరణం మీద, నా లోని హృదయానుభూతి మీద ఆధారపడి ఉంటుంది.

ఆనాటి నుంచీ మాకు చందమామలో కనిపించేది బాబా రూపమే! ఈ దృశ్యం గూర్చి ఎప్పుడైనా భక్తులతో మేము చెప్పగా, వారిక్కూడా చందమామలో భగవాన్ బాబా సందర్శన భాగ్యం కలుగుతోంది!

చాలా సహజంగా అనుభవించే ఈ అనుభవాన్ని నేను ఎవ్వరికీ త్వరపడి వ్యక్తం చేయను. అయినా ఈ దివ్యానుభూతిని నాలో నేను దాచుకుంటే ఎలా? ప్రతిరోజు సాయంకాలంపూట భగవాన్ బాబా వారు ప్రసాదించే ఈ దివ్యలీలలో ఇతరులు కూడా పాలు పంచుకొని ఆనందించే అవకాశం ఇవ్వవలె కదా! అందువల్ల నావలె యితరులు ఈ దృశ్యాన్ని అనుభవించే రీతిగా దీన్ని వ్యక్తం చేస్తున్నాను. స్వామి నిరంతరం మనల్ని ఈ రీతిగా చూస్తూనే ఉన్నారు! ఈ విషయంలో విశ్వాసం ఉన్నా లేకపోయినా, స్వామినిగూర్చి తెలిసినా తెలియకపోయినా స్వామి తమ దివ్యదర్శనాన్ని ప్రపంచం అంతటికీ అందిస్తున్నారు. స్వామి వదనారవిందం, స్వామిరూపం చంద్రబింబం అంతటా నిండివున్నాయి. దీన్ని ఎవ్వరూ ఆక్షేపించలేరు. ఓం జై భగవాన్.

— రాబర్ట్ డి. సిల్వర్, కాలిఫోర్నియా.

# స్వామి బోధలలో ఉపమానాలు

స్వామి మాటలు అమృతపు ఊటలు, దివ్యభావాల మూటలు. ఆధ్యాత్మిక ప్రబోధముల పాటలు, ఆత్మ సౌందర్య వాటికలు, నిత్యానంద పేటికలు!

స్వామి ప్రబోధ చాలా సరళంగా వుంటుంది. ఎంత జటిలమైన ఆధ్యాత్మిక అంశాన్ని కూడా సరళాతి సరళంగా చెప్పటంలో స్వామికి స్వామియే సాటి !

ఈ ప్రబోధాలు పండితుల కోసమే కాదు గదా ! అవి పామరులక్కూడా అవగతం కావాలని ఎంతో తేలిక పదాలతో తేనె లొలికే రీతిగా స్వామి ప్రబోధిస్తారు. బాలురకు కూడా తెలిసే రీతిగా చక్కని ఉపమానాలతో వివరిస్తారు. అందువల్లనే స్వామి చెబుతుంటే ప్రతి ఒక్కరూ అర్థం చేసికొని ఆనందిస్తారు! స్వామి బోధలలోని అమృతపు జల్లులు అజ్ఞానపు ఎడారి హృదయాలలో దివ్యనందనాలు సృష్టించుతాయి! స్వామి ప్రబోధ వాయువులు సంశయాత్ముల మనస్సులలో కమ్మిన సందేహ మేఘాలను తొలగించి ఆత్మ ప్రకాశం కలిగించుతాయి! స్వామి సందేశ బీజాలు సాధకుల హృదయ క్షేత్రాలలో జ్ఞాన వృక్షాలను పెంపొందించి అమృత ఫలాలు పండిస్తాయి!

ఇతరుల ప్రసంగాలలో లేని దివ్య పరిమళాలు స్వామి పసిడి పలుకులలో గుబాళిస్తాయి! అవి శ్రోతలను అలరిస్తాయి! పరవశింపజేస్తాయి!

స్వామి అందించిన "జ్ఞాన వాహిని" దివ్యజ్ఞాన గంగావాహిని! అందులో ఒకసారి మునిగితే చాలు — 'పునర్జన్మ న విద్యతే'! ఈ జ్ఞానవాహినిలో మొలకెత్తిన అందమైన బంగారు పద్మాలవంటి ఉపమానాలు ఎన్నో వున్నాయి. చూ డ ం డి ! ఈ పోలికల తీరులు అమోఘం!

1) "అజ్ఞానము తొలగినపుడు ప్రతి ఆత్మయూ తన స్వరూపముతో ప్రకాశించును. మనకు కనపడున వన్నియూ ఎడారిలోని ఎండమావి వంటివే"

2) "డేగ చేత తరుమబడిన పక్షి ఒక యింటిలో దూరి విశ్రాంతి కొరకు మరల బైటికి పరుగెత్తునట్లు మనసు కూడా అతిసూక్ష్మమైన ఆత్మలో వుండజాలక వెలుపలి ప్రపంచమున తిరుగాడుటకై పరుగెత్తును."

3) "సూర్యోదయముతో చీకటియు, దాని వలన కలుగు కష్టములు కూడా నశించును. ఆ విధముగనే ఆత్మను కనుగొన గలుగుచున్నవారికి బంధము లేదు. దుఃఖము కూడా లేదు.

4) "మనస్సు అనేకమైన వాసనల మూట"

5) "చిత్త సంకల్పము 'నేను' అనెడి బీజమునుండి కలిగినది. 'నేను' అనే విత్తును పారవేయగలిగినపుడు చిత్తమునందుండు వాంఛ దానంతటదే మాయమగును."

6) "ఎప్పుడు జ్ఞాని మనస్సు దేహముతో కలియునో, అప్పుడే బాధ ననుభవించగలడు. మత్తుమందు

తీసుకొన్నప్పుడు బాధ తెలియదు కదా! ఎందు వలన? మనస్సు దేహమునుండి వేరగుట. అట్లే జ్ఞాని కూడా తన మనస్సును ఆత్మయందు ఇమిడ్చి యుంచును. అట్టి స్థితిగలవాడు మాస సిక శిక్షణ వలన మనస్సును ప్రశాంతింప జేసి కొనును."

7) "ఎట్లు అన్నిరకములైన బుడగలు నీరు తప్ప మరేమీ కాదో అట్లే అన్ని విధములైన నామరూప ములు గల ఈ ప్రపంచము బ్రహ్మము తప్ప మరేదియును కానేరదు."

8) "నదులన్నియు సముద్రమున కలియునట్లు అన్ని కోరికలు జీవన్ముక్తుని ప్రశాంతమందు లయ మగుచున్నవి."

9) "ఆధ్యాత్మిక రత్నమును దొంగిలించినది మనస్సే! కాన, మనస్సనెడి దొంగను శిక్షించినచో ఆరత్నము దొరకును."

10) "గుంపులు గుంపులుగా ఈగలు ముసిరినట్లు అంతఃకరణముల నుండి సంకల్పములును, వృత్తులును ఒకే ప్రవాహమువలె గుంపులుగా ఉద్భ వించును."

11) "కోటలో ప్రవేశించు శత్రువులను సైనికుడు ఒకడొకడుగా ఎట్లు చంపునో, అట్లే ఒక్కొక్క వృత్తిని కూడా మనసున పుట్టగనే అంతమొం దింప వలెను."

12) "సంచరించు మేఘములకును, ఆకాశమునకును ఏ విధమైన సంబంధము ఎట్లు లేదో, శరీరమున కును పరమాత్మ స్వరూపమైన నీకును సంబం ధము లేదు".

13) "బాగుగా కాల్చిన ఎట్లు బంగారమునందున్న మాలిన్యము పోయి ధగధగ మెరయునో, అట్లే గాఢమైన వివేకముచే విచారణచే, రాజస, తామస ములు భ్రాంతులు, వాంఛలు, క్రోధములు, అనుమాలిన్యములు పోయి ఆత్మజ్ఞానమను ప్రకా శమును సందర్శింపగలరు."

14) "జీవుడను వృషభము సంసారమనెడి అరణ్యము నందు పెద్ద ఛాయగల బెట్టు క్రింద మోహ మనెడి నీడలో నిద్రించుచున్నది."

15) "దీపమునకు తైల మెట్లు ఆధారమై యున్నదో జ్ఞాన జ్యోతికి దైవభక్తి తైలమువలె ఆధారమై ఉండును. జ్ఞానానందమను మందారవృక్షమునకు భక్తి జలము వంటిదని తలంపవలెను.

16) "ఒక మలినమయిన తెల్లని వస్త్రమును సబ్బు వేసి గానీ, కుంకుడుకాయ వేసిగానీ, చవుడు వేసి గానీ బండపయిన ఉతుకునపుడు ఏలాగున దాని మలినముపోయి పూర్వస్థితి వలె శుభ్ర వస్త్రమగు చున్నదో అలాగున పరిశుద్ధమై సచ్చిదానంద స్వరూపమైన ఆత్మను బాధించిన అజ్ఞాన మయిన మలము నివారణ కొరకు పరబ్రహ్మధ్యానమను సబ్బువేసి నిర్మల నిష్ఠ అనుజలమునందు, వైరా గ్యమనే రాయిపై జ్ఞానధ్యానములనే ఉతు కులు ఉతుకునపుడు నిజబోధరూపమయిన బ్రహ్మా కారము ప్రకాశించును."

17) "వృక్షముతోగూడా వృక్ష మొఱయుటచే దాని యందు ఉద్భవించిన వహ్ని దానిని దహించు విధమున, మాయ యందు పుట్టిన విద్య మాయను దహించును."

18) "వృక్షకర్షముచే బుట్టిన అగ్ని వృక్షమును కాల్చి తరువాత తానునూ నశించునటుల, కతకరేణువు జలమందుండు కల్మషమును బోగొట్టి తానునూ

నశించు రీతి, విద్యయూ, ఆ విద్యను నాశనము చేసిన తక్షణమే తానునూ నశించును."

19) "పాల నుండి వెన్నవలె నిస్సారమయిన సంసారమునుండి సారభూతమయిన ఆత్మసంపత్తును గ్రహించవలెను."

పైన పేర్కొన్న ఉపమానాలలో నిండివున్న జ్ఞానాన్ని కేవలం ఒకసారి చదవటం చేత సాధించలేము. వానిని గూర్చి తీవ్రంగా మననం చేయాలి. ధ్యానం చేయాలి. అప్పుడు వానిలోగల సారం, సందేశం మనదవుతుంది.

—పాతూరి ప్రసన్నం

# వేదాలూ - రామాయణం

శ్రీమద్రామాయణాన్ని పరిశోధించి, అందులోని వైదిక రహస్యాలను వెలికితీసే ప్రయత్నాలు చాలా కాలంగా కొనసాగుతున్నాయి. ఈనాటి రామాయణ పరిశోధకులకు రాముడు ఒక కథానాయకుడు, రామాయణం అతడెదుర్కొన్న కష్టాలూ, సాధించిన విజయాలు ! నవీన పరిశోధనా ప్రమాణాల పరిశోధకులను ఇంతవరకే తయారుచేశాయి! కానీ మన సంప్రదాయంలో రామాయణ రహస్యాలను పలువురు పరిశోధించారు. మధ్వాచార్యులవారు శ్రీమద్రామాయణానికి ఒక మూల రామాయణాన్ని, రాముడనే ఒక మూల పురుషుణ్ణి ప్రతిపాదించారు. వారి దృష్టిలో మూల రాముడు నాలుగు యుగాల్లోనూ ఉంటాడు. ఈ మూలరాముణ్ణి బ్రహ్మదేవుడు ఉపాసిస్తాడు. అలాగే రామానుజ సంప్రదాయంలో కూడా రాముడు సాక్షాత్తు ఆది విష్ణువు. సీతాసాధ్వి ఆదిలక్ష్మి. రామోపాసన అంటే మనలోగల ఆత్మారాముని ఉపాసన అని ఈనాడు భగవాన్ సత్యసాయిబాబా మనకు బోధిస్తున్నారు. రామ శబ్దానికి ఆనందానికి నిలయం అని అర్థం. అనంతమైన ఆనందానికి నిలయం ఆత్మే! చారిత్రక దృష్టిలో రామాయణ కాలాన్ని, ఒక ఐతిహాసిక నాయకుని దృష్టిలో రాముణ్ణి చూడవద్దని స్వామి చెబుతున్నారు. అన్ని యుగాల్లోనూ మానవులందరిలోనూ, ప్రతి ఒక్కరూ తమలో తాముగా తమలోని ఆత్మారాముని సందర్శించటం రామాయణం అందించే సందేశం అంటారు స్వామి! ప్రతి మనిషీ తన జీవితంలో కష్టాలను ఎదుర్కొంటాడు. ఇవన్నీ రామకథలో సూచన ప్రాయంగా కనబడతాయి వీటిని వాల్మీకి మహర్షి ప్రతీకన్యాయంగా (Symbolic) రామాయణంలో ప్రతిబింబింప చేశారనీ, రామకథ ద్వారా మనం తెలుసుకోవలసింది మనలోని ఆత్మారామునినే నని మన మహర్షులు చెబుతారు. ఈ అంశాన్ని ఆధునికులు గమనించటం లేదు. కృతయుగంలో రాముడనే పెన్నిధి ధ్యానంచేత, ధర్మాచరణ చేతనూ, త్రేతాయుగంలో యజ్ఞయాగాది రూపమైన త్యాగంచేతనూ, ద్వాపరంలో స్థిరమైన ధర్మబుద్ధి చేతనూ, కలియుగంలో దీన దుఃఖితుల రూపంలోని

పతితపావన నారాయణ సేవద్వారా నామస్మరణ చేతనూ రామతత్త్వాన్ని మనం తెలుసుకోవాలి.

వేదాలసారం అంతా రామాయణంలో ఉన్నదని స్వామి వివరించారు. అయితే రామాయణ వ్యాఖ్యాతల్లోని ప్రాచీనుల దృక్పథానికీ, స్వామి దృక్పథానికీ తేడా ఉంది. ప్రాచీనులు వైదిక దర్శనాలయిన న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వోత్తర మీమాంసలను రామాయణంలో చూడాలని ప్రయత్నించారు. పూర్వ మీమాంస కర్మాచరణకూ, ఉత్తర మీమాంస బ్రహ్మజిజ్ఞాసకూ ప్రాధాన్యము నిస్తాయి. పూర్వమీమాంసకు ఉత్తర మీమాంసకు సమన్వయం కుదుర్చుకోలేక పోయారు. సమన్వయ స్థాపన అవతార పురుషులు చేసే మహత్కార్యం. స్వామి ఈ రెంటినీ నేడు సమన్వయపరచారు. సర్వవ్యాపక పరబ్రహ్మ తత్వంలో విశ్వాసం లేని కర్మాచరణకూ, కర్మాచరణలో ప్రతి ఫలించని బ్రహ్మజిజ్ఞాసకూ విలువలేదని స్వామి ప్రబోధిస్తారు! ధర్మ కర్మాచరణ మన ఐహిక ఆముష్మిక జీవితాలను స్వర్గతుల్యం చేస్తే, పరబ్రహ్మ తత్త్వాన్ని తెలిసికొనే ప్రాథమిక ప్రబోధను బ్రహ్మ సూత్రాలు ప్రతిపాదిస్తాయి. అపార కరుణా నిధానమైన పరమేశ్వరతత్త్వం మానవుని ముక్తిమార్గంవైపు నడిపించటానికి మానవరూపంలోనే అవతరిస్తుంది. రామాయణాన్ని నిత్యమూ పారాయణ చేసేవారు నాలుగువేదాలూ కలసి అయోధ్యరాముడుగా లోకోద్ధరణ కోసం అవతరించినట్లుగా భావిస్తారు. వీరి దృష్టిలోనూ రామకథ వేద వేదాంతాల సారమే. మాధ్వ సంప్రదాయ అనుయాయులు కూడా ఇలాంటి వైదిక సమన్వయాన్ని రామాయణంలో చూస్తారు. వారి దృష్టిలో భగవంతుని అవతారాలు అనంతమైనవి, వీటి వెనుకగల మూలాధారతత్త్వం శ్రీరామతత్త్వం. స్వామిచెప్పిన 'రామకథారసవాహిని'లో ఈ దృక్పథం ప్రస్ఫుటంగాకనబడుతుంది, రామకథారసవాహినిలోని వాలి సాత్త్విక గుణసంపన్నుడు. శ్రీరామభక్తుడు. శ్రీరామునికి ప్రియతముడు. మధ్వాచార్యులవారుకూడా తమ మహాభారత తాత్పర్య నిర్ణయంలో రామావతారంలోని వాలి కృష్ణావతారంలోని అర్జునుడని సూచిస్తారు. అవతార పురుషులతో సన్నిహితంగా మెలగెడి జీవులకు ఆంతరికమైన పరిణామంతోటి ముక్తిపథంలో పురోగతి లభిస్తుందని మధ్వాచార్యుల వారు వ్రాస్తారు. ఈ రీతిగా అవతార పురుషులు జీవకోటిని సముద్ధరిస్తారు! వాల్మీకి రామాయణం తర్వాత ఆధ్యాత్మ రామాయణం, ఆనంద రామాయణం వంటి రామాయణాలు వచ్చాయి. ఇవీ, ఇంకా రామాయణంలోనే అంతర్గతంగా ఉన్న యోగవాసిష్ఠమూ నిర్గుణ బ్రహ్మతత్త్వాన్ని, నిరాకార పరమేశ్వర తత్త్వమును బోధిస్తాయి. ఈ దృక్పథాలన్నీ వాల్మీకి రామాయణంలోనూ, రామకథా రసవాహినిలోనూ కనబడతాయి.

రామకథావాహినిలో స్వామి కొన్ని మార్మికమైన అంశాలను వెల్లడించారు. అవి శివశక్తి ఉపాసనకు చెందినవి. రావణుడు శివుని వరం పొందగలిగాడు. పురుషుణ్ని (రాముడు-శివుడు) తృణీకరించి, ప్రకృతి స్వరూపిణిని (సీత-పార్వతిని) వాంఛించాడు. పార్వతిని తనవెంట లంకకు పంపమని అడిగాడు. చివరకు తనతో వస్తున్నది పార్వతి కాదనీ మహాకాళి అని తెలిసికొని భయంతో కంపించి పోయాడు. తంత్ర సూత్రాల ప్రకారం మూలాధార మండలంలో, కామంతో ఆవరింపబడి వహ్నిత్రికోణంలో కేంద్ర బిందువుగా నివసిస్తుంది ప్రకృతి, శక్తి! ఈ శక్తిని 'శ్రీ' అని 'త్రిపురసుందరి' అనీ శాక్తులు వ్యవహరిస్తారు. లంకకు 'త్రికూటాచలం' అనే మరొక పేరు కూడావుంది. లంకను మూడు శిఖరాలున్న ఒక పర్వతంగా వర్ణించారు. ఈ త్రికూట శబ్దం శ్రీ చక్రాన్ని బోధించే శబ్దం. సీతామహాదేవి ఈత్రికూట

చక్రమధ్యంలో నివసించే వహ్ని స్వరూపిణి. అందుకే లంక అగ్ని చేత దహింపబడింది. రూపం, సౌందర్యం, ఆకర్షణ అనేవి అగ్నికిగల లక్షణాలు. సీతారాములు ఇలాటి అగ్ని తత్త్వంతో సంబంధం కలవారు, అగ్ని దేవుడు సమర్పించిన పాయసంతో రామావతరణ జరిగింది. అలాగే యజ్ఞవాటిలో భూమిని యజ్ఞార్థం దున్నుతూ వుండగా సీతాదేవి ఉద్భవించింది. సుందరకాండలో శివశక్తుల ఉపాసన వుంది. ఈ రీతిగా రామాయణంలో సీతారాములకూ శివశక్తులకూ గల తాత్త్విక సమన్వయం స్ఫురించే ఘట్టాలున్నాయి. శ్రీరామచంద్రుడు ప్రజల నుద్దేశించి చేసిన ప్రబోధలో శివకేశవుల అభేదత్వం నిరూపించ బడినట్లుగా స్వామి రామకథారసవాహినిలో వివరించారు. శివకేశవుల ఈ అభేద తత్త్వమే రామునికి శివునకూ, సీతకూ శక్తికీ గల ఏక రూపతను నిరూపించుతుంది. మధ్వాచార్యుల వారు కూడా నారాయణుని స్వ-రమ ణుడుగా వర్ణిస్తారు. ద్వైతులు నారాయణునిలో స్త్రీ పురుష తత్త్వాని గుర్తిస్తారు. అలాగే శక్తి తత్త్వాన్ని అంగీకరిస్తారు. రామాయణం కూడా శక్తి తత్త్వ ప్రతిపాదకం. కనుక రామాయణ పారాయణ సుందరా కాండ నుంచి ప్రారంభమవుతుంది !

రసాలన్నిటిలోనూ కరుణరసం ప్రధానమైనదిగా స్వామి వివరిస్తారు. 'కరుణ' అంటే మానవమాత్రులు చూపించే 'జాలి' కాదు. ఈ కరుణరసం పరమేశ్వ రుని మహోన్నత స్వభావం ! మానవుడు ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను సాధించటం ఎంత అవసరమో, అంతగా భగవంతుని కృపను సాధించటం కూడా అవసరం ! "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అన్న బ్రహ్మసూత్ర వాక్యానికి వివరణ వ్రాస్తూ 'అథాతో' - అనగా - 'ఆతరువాత' - అనే పదానికి - పరమేశ్వర కటాక్షం పొందిన తరువాత - అనే అర్థాన్ని సూచిస్తారు మధ్వాచార్యుల వారు.

స్వామి రామ కథారసవాహినిలో మరొక సూక్ష్మ ధర్మం తెలియజేశారు. రామరాజ్యంలో ఒక బాలుడు మరణిస్తాడు. అకాల మరణం చెందిన బాలుని తండ్రి రాముని ముందు దుఃఖిస్తాడు. అలాటి అకాల మర ణానికి కారణం రామపాలనలో లేదనీ, ప్రజల మన స్సులో ఎచటనో చెడు భావాలు కలిగాయనీ శ్రీరామ చంద్రుడు గుర్తిస్తాడు. కనుక తనప్రజలలో ఎవరి మనస్సులలోనూ చెడు తలపులు రాకుండానూ, దాని వాతావరణం కలుషితం కాకుండానూ శ్రీరామ చంద్ర మూర్తి ఏర్పాటు చేశాడు. శ్రీరాముడు ఒక శూద్ర తపస్విని సంహరించాడని యింతకు ముందుగల గాథను స్వామి సంస్కరించారు. ఒక్కరి పాప భావనకు సమాజం యావత్తూ బాధ్యత వహిస్తుంది!

ఈ రీతిగా అనేక విధాలుగా ప్రత్యక్ష ప్రమాణాల తోనూ, మార్మికమైన సూచనలతోనూ రామకథారస వాహినిలో స్వామి వైదిక ప్రామాణికతను అను బంధాన్ని వివరించారు.

(కన్నడ వ్యాసం నుంచి)

—ప్రొఫెసర్ R. G. కులకర్ణి,

శ్రీసత్యసాయి కళాశాల



# సంశయ మెందుకు?

"భక్తుడు తన వైపు వేసే అడుగులకన్న భగవానుడు భక్తునివైపు వేసే అడుగులు మిన్న. నీవు భగవానునివైపు ఒక అడుగు ముందుకువేస్తే ఆయన నీ వైపు వంద అడుగులు ముందుకు వస్తారు".

యుగావతారమూర్తి భగవాన్ బాబా భక్తులకు ఇస్తున్న హామీ ఇదే. ఆధ్యాత్మిక సాధకులు గమ్యం వైపు పురోగమించడంలో, దైవత్వాన్ని సాక్షాత్కరింపజేసుకోవడంలో భగవానుని ఈ హామీయే కొండంత బలంగా ఉన్నది. అపార కరుణామయుడైన ఆ పరమాత్మ ప్రతియుగంలో అవతారం ఎత్తినప్పుడల్లా మానవాళికి వరప్రసాదంగా ఇచ్చిన హామీ ఇది. భగవద్గీతను దివ్యసందేశంగా వినిపించిన శ్రీకృష్ణ పరమాత్మ తన అవతార విశిష్టతను ప్రకటిస్తూ, సన్మార్గులను, భక్తులను కంటికి రెప్పవలె కాపాడతాననీ, అదే తన అవతార ప్రధానోద్దేశమని చాటి చెప్పాడు. అర్జునుని నిమిత్తమాత్రంగా చేసికొని దుఃఖజాలంలో చిక్కుకొన్న సర్వ మానవులకు తన అనుగ్రహం విషయంలో సందేహించనవసరం లేదని పలుసార్లు వాగ్దానం చేశాడు. ఎవరు ఏవిధమున నన్ను సేవించెదరో, తదనుగుణముగా నేనునూ వారిని అనుగ్రహించెదను" (గీ. 4 అ. 11 శ్లో.); "నా భక్తులను అనుగ్రహించుటకై వారి అంతఃకరణము నందున్నవాడనై అజ్ఞానమువలన జనించిన మోహాంధకారమును ప్రజ్వలించుచున్న జ్ఞానదీపముచే నశింపచేయుదును." (గీ. 10 అ. 11. శ్లో.) అని కృష్ణ పరమాత్మ దయతో భక్తులకు హామీ ఇచ్చి ఉన్నాడు.

భగవానునిలో మనకు విశ్వాసం ఉన్నది; కనీసం అట్టి భావన అయినా మనలో ఉన్నది గదా! అలాంటప్పుడు, భగవంతుడు మనవైపు పరమకృపతో శరవేగముగా వచ్చి ఆదుకొనునట్లు చేయు భక్తి ప్రపత్తులతో ఆ పరాత్పరునివైపు కొన్ని అడుగులు ముందుకు వేయడంలో సంకోచమెందులకు? భగవానుని వైపు వేసే అడుగులలో తడబాటు ఏల? భగవంతుని వైపు ముందడుగు వేయడంలో సంశయం ఎందుకు? మానవాళికి ప్రతినిధిగా నిలచిన అర్జునునివలె మనలోని బలహీనతలను ఏదో విధంగా సమర్థించుకోవాలని తొలుత ప్రయత్నిస్తాం. అర్జునుడు సంశయ మనస్కుడైనప్పుడు కలత చెందుతాడు. అదే అతని విషాదానికి కారణమైంది. అయితే అర్జునునిది కేవల విషాదం మాత్రమే కాదు. అది విషాదయోగం. పరమాత్మతో సాయుజ్యం పొందాలనే ఆర్తి, ఆత్మ సాక్షాత్కారం పట్ల తపన ఉన్నప్పుడే అది యోగం అవుతుంది. అర్జునుని క్షణంసేపు కార్పణ్యమనే దోషం ఆవహించింది. దానితో కర్తవ్యంపట్ల దిగ్భ్రాంతి చెందాడు. అయితే, ఆధ్యాత్మిక పథంలో శిష్యుడు చేయవలసిన పని చేశాడు. శిష్యస్నేహం అంటూ తన గురువుకు శరణాగతుడైనాడు. జగద్గురులైన శ్రీకృష్ణ భగవానుని చరణకమలములందు సంపూర్ణ శరణాగతుడైనాడు, "కృష్ణా! కార్పణ్యదోషము నా స్వభావమును చెదరగొట్టినది. కర్తవ్యాకర్తవ్య నిర్ణయము చేసికొనలేకుండ ఉన్నాను. ఏది ధర్మమో, ఏది అధర్మమో

తెలియకున్నది. నాకు ఏది శ్రేయస్కరమో, అది నీవే నిర్ణయించి చెప్పుము. నీకు శిష్యుడను, నీకు శరణాగతి చేసితిని. నన్ను శాసించుము" (గీ. 2 అ. 7 శ్లో.) అని అర్జునుడు వేడుకొంటాడు. భగవానునికి శరణాగతుడు కావడమే మొదట చేయవలసిన పని. అదే ఉత్తమపద్ధతి. అర్జునుడు అదే చేశాడు. పరమాత్మ ఆలస్యం చేయలేదు. వెంటనే తన దివ్యానుగ్రహాన్ని ప్రసాదించాడు. శరణాగతుడైన భక్తుని సర్వ బాధ్యతలు స్వీకరించాడు. శిష్యునిలోగల అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేసి, అంతర్గతంగా ఉన్న జ్ఞానదీపికను ప్రజ్వలింపచేశాడు. అతనిలోని భ్రాంతిని తొలగించి, స్వస్వరూప స్మృతిని కలిగించాడు. నష్టో మోహ, స్మృతిర్లబ్ధ్వా). ఓ మానవుడా, భగవానుని అనుగ్రహంపట్ల నీకింకా సందేహమెందుకు? శరణాగతిలో సంశయమేల? భగవంతునివైపు వేసే అడుగులలో తడబాటు దేనికి? సంకోచమెందుకు?

చేతిలోవున్న ఒక పిట్టను విడిచి, పొదలో ఉన్న రెండింటికోసం వెళ్ళడం అవివేకమని సంశయాత్మకమైన మనసు అంటుంటుంది. ఇప్పుడే ఇక్కడే ప్రత్యక్షంగా లభించే ఐహిక సుఖభోగాలను విడిచిపెట్టి ఎక్కడో, ఎప్పుడో లభించగలదన్న మోక్షంకోసం అన్వేషించడం వివేకమా? అని సంశయాత్మకుల మనసు ప్రశ్నిస్తుంటుంది. కాని ప్రాపంచిక సుఖాలంటే ఏమిటి? తరంగాలవంటి బాధలకు మధ్య కలిగే విరామసుఖం తప్ప. అది వాస్తవిక సుఖం కాదు. మధ్య మధ్య వచ్చిపోయే అల్పమైన సుఖాలనే నిజమైన ఆనందంగా భ్రాంతి చెందుతుంటాం. వాస్తవమైన ఆనందం వచ్చిపోయేది కాదు, సహజసిద్ధమై ఉండేదే అది. సాధకులు చేరుకోవలసిన వాస్తవ గమ్యస్థానం అట్టి సహజానందమే. మానవులు అట్టి ఆనందధామానికి చేరుకోవాలన్నదే భగవంతుని ఆకాంక్ష. ఆయనే ఆ మార్గం చూపిస్తూ, ముందుకు నడిపిస్తుంటాడు. సత్యస్వరూపాన్ని అనుభూత మొనర్చుకోగల వివేకాన్ని, బుద్ధిని, ఇచ్ఛాశక్తిని మానవులకు భగవానుడు ప్రసాదించాడు. భగవద్భావనతో, పరమాత్మ సాక్షాత్కారం కోసం మానవులు తమధీశక్తిని వినియోగించుకోవాలి.

ప్రపంచంలోని అన్ని విషయాలవలెనే మానవునిలో కూడ రెండురకాల భావనలు ఉంటాయి. అతనిలోని కోరికలు, రాగద్వేషాలు, ప్రాపంచిక విషయజాలవైపు గుంజివేస్తుంటాయి. మరొకవైపున అతనిలోని ఇచ్ఛాశక్తి, బుద్ధి, వివేకం తన సహజ స్వభావమైన దైవత్వంవైపు అనురక్తమవుతుంటాయి. ఈ రెంటిలో ఏ మార్గం వైపు పురోగమించాలి? దేనిని స్వీకరించాలి? తన స్వప్రకాశంవల్ల గోచరించే తన నీడ ఒకటి. స్వప్రకాశమునకు మూలమైన ఆత్మజ్యోతి మరొకటి. తన నీడను వెంబడించి వెడుతూ, స్వయంజ్యోతికి దూరం కావడమా? లేక వెనుదిరిగి, స్వయంప్రకాశమైన ఆత్మవైపు పయనించడమా? "నీవు నీడను అనుసరించే పక్షంలో ఆత్మకు దూరం అవుతావు. గమ్యానికి చేర్చని అనంత ప్రయాణం అది. నీవు ఆత్మవైపు తిరిగినప్పుడు నీ నీడ నీకు వెనుకవైపు పడుతుంది. అది నిన్ను ఎంతమాత్రం భ్రాంతిలో పడవేయలేదు. పరమాత్మునివైపు వేసే ప్రతి అడుగు, నిన్ను నీ నీడ అనే భ్రాంతికి, లేదా మాయకు దూరం చేస్తుంది. నీడ వెంబడి నడిస్తే మాయలో పడినట్లే. ఆత్మవైపు తిరిగితే మాయ వదలినట్లే" అని భగవానుడు దయతో వినిపించే దివ్యవాణిని ఆలకించేవారు ధన్యులు అవుతారు. "కష్టాలనేవి మనల్ని శరవేగంగా పూర్ణత్వానికి చేర్చే అశ్వాలు" అనే మాటలు నిజమే అనిపిస్తాయి. అయితే, దివ్యజీవన ఆనందానుభూతికి, కష్టాలు అనుభవించే తీరాలా? అవసరం లేదని భగవానుడే స్వయంగా చెబుతున్నాడు.

"నాయందే నీ మనసును లగ్నము చేయుము, నా అనుగ్రహమువల్ల సమస్త సాంసారిక దుఃఖములను దాటగలవు" (గీ. 18అ. 58 శ్లో.) అని పరమాత్మ హామీ ఇచ్చాడు. "ఎవరు నన్ను ఏకాగ్రచిత్తంతో భక్తి చేయుదురో, ప్రేమతో సేవించుదురో అట్టివారికి జ్ఞానమును ప్రసాదించి, తద్వారా వారిని నాలో చేర్చుకొందును" అని కూడ కృష్ణ పరమాత్మ పరమ దయతో అనుగ్రహించియున్నాడు. ఇంకా నీకు సంశయమెందుకు? భగవానుని వైపు వేసే అడుగులలో తడబాటు దేనికి? సంకోచమెందుకు?

ఆధ్యాత్మిక మార్గంలో సాధన చేస్తున్నవారు సమాజానికి దూరమై పోతారన్న అపోహ ఎంత మాత్రం సత్యం కాదు. అత్యధిక సంఖ్యాకులు భగవద్వాణిని వినిపించుకోలేక పోతున్నారనేది నిజం. పరమాత్మ స్థానాన్ని చేరుకోవాలని ఆకాంక్షించేవారు సైతం కొద్దిమంది మాత్రమే. సహజ స్వభావమైన మాయా ప్రభావం వల్ల బహుకొద్ది మంది మాత్రమే పూర్ణస్థితిని చేర్చే మార్గంలో అడుగిడ గల్గుతున్నారు. మానవుడే తమలోని కోర్కెల ప్రేరణ ప్రాబల్యంవల్ల. ఇంద్రియ సుఖాలనే వలలో, చిక్కుకొనడంవల్ల అనేకులు అందులోనుండి బయట పడలేక సతమతమవుతున్నారు. ఏది సత్యము, ఏది అసత్యము అనే తత్త్వ విచారణ ద్వారా వారిలో వివేకం ఉదయించే వరకు వారికి ఇట్టి దుస్థితి తప్పదు. భగవదనుగ్రహం వల్ల క్రమేణా వారు కూడా జ్ఞానమార్గంలోకి మళ్లుతారు. నామరూపాత్మకమైన ప్రపంచంలో సైతం సాధకులు శారీరకంగా సమాజానికి దూరంకారు. సాధకులు మరింత హెచ్చుగా మనుషులతో కలసి మెలసి వుంటారు, కాని ఇతరులవలె వారు బాహ్యప్రపంచంలో అనురక్తులై వుండరు. రాగద్వేషాలు లేనిస్థితిలో అంటకుండా వుంటారు. సాధకుల ఉనికికి లోపం వుండదు. సమాజంతో అతని సంబంధాలు తెగిపోవడంగాని, చెడిపోవడంగాని, సంకుచితం కావడంగాని జరగదు. అతను ఏ స్థితిలో వున్నప్పటికినీ, బుద్ధి వికాసానుసారం కర్మ చేస్తూనే వుంటారు. సృష్టి ఉద్దేశంకూడ అదేనని భగవానుడు సైతం ప్రకటించాడు 'లోకసంగ్రహార్థం నీవు కర్మలు చేస్తూ వుండాలి' (గీ 3అ 20శ్లో). కర్మఫలమునందు దృష్టివుంచక, భగవద్భావనతో కర్మలలో నిమగ్నుడు కావలసి వుంటుంది. వాటంతట అవిగా వచ్చిన వాటిని స్వీకరిస్తాడేగాని, కర్మ ఫలముల గురించిన యోచన అతనికుండదు. అతను చేసే ప్రతికర్మ భగవదర్పన భావంగా చేస్తున్నప్పుడు, కర్మఫల మతని కెట్లు అంటును. సాధకుని జీవితమే ఒక ప్రార్థన, అతను చేసే ప్రతికర్మ అర్చనే. అతను పొందే సుఖశాంతులు బాహ్యమైన లాభాలనుంచి, విజయాలనుంచి, లభించేవికాదు. అసలు బాహ్యమైనవి అతనికి పట్టనే పట్టవు. అతను పొందే ఆనందానుభూతి బాహ్యప్రపంచంనుంచి కానేకాదు. శరణాగతి ద్వారా, నిరంతరం పరమాత్మ సాన్నిధ్యభావనవల్ల అతనికి ఆ ఆనందం లభిస్తుంటుంది. తను బాహ్య ప్రపంచంలోనే వుండాడు, కాని అందులో తాను అనురక్తుడుకాడు. సర్వభూతముల యందు తనను, తనయందు సమస్త భూతములను చూస్తుంటాడు. అంతటనూ సమదృష్టికలవాడై వుంటాడు (గీ. 6అ 29శ్లో) సమాజం అతనికి సన్నిహితమై వుంటుంది. తోటి మానవులకు, సమాజానికి అతను సన్నిహితుడు, ఆత్మీయుడునై వుంటాడు. ద్వైతభావన అనేది లేదు కాబట్టి అతను నిర్భయుడై వుండాడు. రెండవది ఉన్నప్పుడే గదా భయ మనేది. అందరూ తానుగా, తనలో అందరినీ అతను దర్శిస్తుంటాడు. ఆధ్యాత్మిక పురోగతిలో సంఖ్య ముఖ్యం కాదు. ఎందరు తరించారనేది లెక్కకాదు. "ఎన్నో వేల మంది మనుష్యులలో

వాన్ నేడు మనకు అండగా ఉన్నారు. సర్వమానవులపై అపారప్రేమను కురిపిస్తున్న భగవాన్ మన లక్ష్య నిశ్చయంలో ఎట్టి సంశయము వలదని ఉద్బోధిస్తున్నారు. కర్తవ్యనిష్ఠులమై వారి అనుగ్రహమును పొందుటయే మనము చేయవలసిన పని. అంతఃశత్రువులను జయించి ఆత్మోన్నతి నందు సాధనకు భగవానుని పాదపద్మములే శరణ్యములు. "నన్ను నీ రథసారథిగా చేసికొనుము. పరమాత్మ సాన్నిధ్యమునకు నిన్ను నేను చేర్చగలను" అని భగవానుని దివ్యవాణి మనకు హామీ ఇస్తున్నది.

భగవానుని దివ్యవాణి సుస్పష్టమై వినిపిస్తున్నది. ఎట్టి సంశయమునకు ఆస్కారము లేదు. అర్జునునివలె భగవానుని చరణ కమలములయందు సంపూర్ణ శరణాగతి చెందుట ఒక్కటే మనకు శరణోపాయము. ఇక మన అడుగులు ఎంతమాత్రము తడబాటు చెందరాదు. సంశయమును వీడి భగవానుని వైపు పురోగమిద్దాం. మన పెదవులపై ఆయన నామమును జపిస్తూ మన హృదయాలలో ఆయననే ప్రార్థిస్తూ ఆయనవైపే ముందడుగు వేద్దాం.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

—సి. పి. కె. నాయర్



# విద్య అనగా నేమి

విద్యార్థులారా !

అనేక జన్మలలో మీరు చేసికొన్న పుణ్యఫలముగా ఈ సత్యసాయి లోకసేవా విద్యాసంస్థలలో మీరు ప్రవేశించినట్లుగా మీరు గుర్తించుకోవాలి. విద్యార్థి అనే పదానికి గల అర్థమేమి? విద్యార్థి యనగా విద్యను అభ్యసించువాడు అని అర్థము. విద్య అనగా యేమి ? 'విత్' అనగా వెలుగు – 'య' అనగా యిచ్చునది. విద్య అనగా వెలుగు నిచ్చునది, అని అర్థము, సూర్యకృపచేత మనము కనులతో వెలుగును చూడగలుగుతున్నాము. ప్రకృతిలోగల వస్తువులనన్నింటినీ కనులు మనకు విశదముగా చూపించగలవు. ఈ రీతిగనే మనకు గల పంచేంద్రియములు ప్రపంచ సంబంధమగు సమాచారమును మనస్సునకు అందజేస్తాయి. మనస్సునకు బుద్ధి అనే యజమాని ఒకడు ఉన్నాడు. ఈ బుద్ధి మంచినీ, చెడునూ విడమరచి చూడగలుగుతుంది. చెడును విడిచి మంచినే గ్రహించమని చెబుతూ ఉంటుంది. అయితే ఈ బుద్ధికి కూడా ఆత్మ అనే ఒక అధిష్ఠానం ఉంది. సత్యాన్ని, మంచితనాన్ని, సౌందర్యాన్ని మీరు గ్రహించినప్పుడు ఈ ఆత్మ మీకు ఆనందాన్ని ప్రసాదిస్తుంది. సౌందర్యం అంటే క్షణకాలం మెరిసేటటువంటి భౌతికమైన ఆక

ర్షణ కాదు. విద్య అనగా చీకటిలోనుంచి వెలుగులోకి వెళ్ళటం, ఆత్మ విషయికమైన అజ్ఞానం నుంచి ఆత్మ జ్ఞానంలో ప్రవేశించటం. చీకటినుంచి వెలుగులోకి దారి చూపే ఈ విజ్ఞాన జ్యోతిని మానవులు కోరటం లేదు. వారు చేసే సాధనలో స్థిరత్వం లేకపోవుటయే ఇందుకు కారణం! ఐహికమైన సుఖాన్ని మాత్రమే వాంఛిస్తున్నారు. భవిష్యత్తులో సుఖాన్ని కలిగిస్తాయనే ఆశతో ఏవేవో వస్తువులనూ, వాటిని సమకూర్చుకొనుటకై ఏదో విధముగా ధనమును సంపాదించుటలోనూ నిమగ్నులైనారు. ఈ రీతిగా చేసే కృషి ఎండమావుల వెంట పరుగులు తీయటం వంటిది. అలా కాకుండా అంతరాత్మ స్వరూపంలో నిక్షిప్తములైన సత్య శివ సౌందర్యములను తెలిసికొనుటకై సకల ప్రయత్నములూ చేయాలి.

ఇప్పుడు మీరు ఆత్మ అనేది దానిని తెలిసికొనలేక పోతున్నారు. మీరు చేసే కృషిలో శ్రద్ధ, స్థిరత్వమూ లేకపోవుటయే ఇందుకు కారణం. సక్రమంగానో అక్రమంగానో బాహ్య జగత్తులో మీరు పొందగల అమూల్యమైన వస్తువులున్నాయని మీరు భావిస్తూ ఉన్నారు. కానీ ఎవ్వరికీ హాని కలిగించనటువంటి స్వచ్ఛమైన, అఖండమైన ఆనందం అనేది మీరు చేసే అంతరాన్వేషణలోనే ఉన్నది.

క్షణికమైన సుఖాన్ని పొందటంలో మీరు విఫలం చెందినపుడు, లేదా దానికి ఆటంకం ఏదైనా కలిగినప్పుడు మీలో క్రోధ, ద్వేషములు తలలెత్తుతాయి. కోపిష్టియైన మానవుడు గ్రుడ్డివాడూ, తత్కాలమునకు పిచ్చివాడు అవుతాడు. దుర్వాసుడు మానవాకృతి వహించిన క్రోధంవంటి వాడు. దుర్ అనగా చెడు; దుర్వాసుడనగా చెడ్డ వాసనలు (సంస్కారములు) కలవాడని అర్థము. అహంకారమనేది క్రోధంద్వారా చాలా దుష్టముగా అభివ్యక్తం అవుతూ ఉంటుంది.

మీరు చేసే ప్రయత్నంలో విజయం పొందగలమనే విశ్వాసం మీలో కలగాలి, ఆత్మ నిత్యమైనదిగా ఉంటుందనే విశ్వాసం మీలో కలగాలి. సర్వకాల సర్వావస్థలలోనూ ఆత్మానుభవం పొందగలమనే విశ్వాసం కూడా మీరు కలిగి ఉండాలి. అప్పుడే మీకు ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. ఏ పనిలోనైనా విజయం సాధించవలెనంటే విశ్వాసం ప్రధానమైనటువంటిది. మీ శక్తి సామర్థ్యాలలో మీకు విశ్వాసం ఏర్పడిననాడే మీరు మీ విద్యా సముపార్జనలో కూడా ముందంజ వేయగలుగుతారు. లౌకికమైన అవసరాల కొరకు లౌకికవిద్య అవసరమే. కానీ ఈ లౌకిక విద్యవలన మీకు నిజమైన శాంతి, ఆనందాలు లభింపనేరవు. మీ కృషిలో మీరు కృతకృత్యులయితే గర్వంతో విర్రవీగిపోతారు, ఎవ్వరినీ మీరు లెక్కచేయరు. కానీ మీ ప్రయత్నంలో పరాజయం పొందితే నిరాశా నిస్పృహలతో క్రుంగిపోతారు. జయాపజయాలు మానవ జీవితమునందు అనివార్యములనీ, వాటిని సమచిత్తంతో ఎదుర్కొనవలెననీ లౌకికవిద్య వల్ల మీరు గ్రహించలేరు. ఇలాంటి గ్రహింపు ఆధ్యాత్మిక విద్యవలననే సాధ్యం అవుతుంది.

లౌకిక విద్య వాంఛలనూ, బంధాలనూ పెంచుతుంది. ఆధ్యాత్మిక విద్య శాంతికీ నిస్సంగతకూ దారిచూపుతుంది. లౌకిక విద్య అహంభావాన్ని పోషించుతుంది. ఆధ్యాత్మిక విద్య అహాన్ని పరమాత్మ పాదాబ్జములకు సమర్పణ చేస్తుంది. యాదవులకు కృష్ణ పరమాత్మునితో సంబంధం అహంకార పూరితమయినది. వారిదృష్టిలో కృష్ణ పరమాత్ముడు వారి బంధు వర్గంలోని ఒక వ్యక్తి! కనుకనే శ్రీ కృష్ణ నిర్యాణమునకు ముందుగనే వారందరూ తమలో తాము కలహించి నశించి పోయారు. కానీ గోపికల చర్య యిందుకు భిన్నమైనది. వారు తమ అహంభావాన్ని, తమ వ్యక్తిత్వాన్నీ శ్రీకృష్ణునికి

సమర్పణ చేసికొన్నారు. అందువల్ల వారి ఆనందం అఖండంగా కొనసాగింది. చిన్న మొక్కలవలె వున్న మీ అందరికీ ఈ లోకసేవా విద్యాసంస్థలో ఇటువంటి ఆధ్యాత్మిక విద్యను నేర్పుతారు. మీరంతా మీ విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించండి, భారతీయుల ఆధ్యాత్మిక సంస్కృతిని వికసింప జేయుట కోసం మీరంతా అభివృద్ధి కారకులుగా రూపొందండి.

అప్పుడే పుట్టిన శిశువు 'కోహం' "నేనెవరిని" అంటూ ప్రశ్నిస్తుంది. ఆ శిశువు చేసే మొట్టమొదటి ఆక్రందనంలోని అంతరార్థం అదే ! మానవుడు ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకోలేకపోతే ఎంతో కాలం జీవించి ఏం ప్రయోజనం? ప్రకాశింపజేసే విద్యుత్తు లేకపోయిన తర్వాత ఎంతో పెద్ద విద్యుద్దీపం వుండి ప్రయోజనం ఏమిటి ? మానవుడు కుక్కల వలె నక్కల వలె జీవించ కూడదు. ప్రతి జీవినీ దగ్గరగా చేర్చే ప్రేమబంధం రూపంలోనే భగవంతుడు ప్రతి ఒక్కరిలోనూ వున్నాడని మానవుడు గుర్తించాలి. అప్పుడే తాను పుడుతూనే వేసికొన్న ప్రశ్నకు అతడు సమాధానం పొందగలుగుతాడు. అప్పుడే "నేను ప్రేమ స్వరూపుడను. నేను పరమాత్ముడను." అని ప్రతి ఒక్కరూ గుర్తిస్తారు. మీరంతా క్రమ శిక్షణతో మెలగాలి. భక్తి ప్రపత్తులు కలిగివుండాలి. ధర్మమే దైవం. కనుక మీరంతా మీ తరగతులకు సక్రమంగా హాజరుకండి. పాఠాలు నేర్వండి. విద్యనూ, కాంతినీ అన్వేషించే నిజమైన విద్యార్థులుగా మెలగండి. ప్రతి రోజు ఉదయం, సాయంత్రం దైవప్రార్థన చేయండి. మీరంతా ఈ విశాలమైన ప్రాంగణాన్ని ప్రతి అంగుళం మేరనూ ఎంతో శ్రమించి ఎంతో భక్తితో ప్రేమతో పరిశుభ్రం చేశారు. ఈ పనికోసం మీరు తీసికొన్న సమయం, మీరు ధారపోసిన శక్తి ఎంతటివో కూడా నాకు తెలుసు. ఆయినప్పటికీ నేను మీతో యింతకంటె ఎక్కువసేపు ఇచ్చట ఉండలేక పోతున్నాను. త్వరలోనే నేను మరొకసారి యిచటకు రావాలనీ, మీ అందరితోనూ ఇంకా ఎక్కువకాలం గడపాలనీ ఆశిస్తూ, ఆశీర్వదిస్తున్నాను.

— (భగవాన్ అలేకీలోని విద్యార్థులకు చేసిన దివ్యప్రసంగం ఆధారంగా.)

## పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | రామకథా రసవాహిని | 9-00 | 0-60 |
| 3. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 4. | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 5. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 6. | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 8. | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 9. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 10. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 11. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 12. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 13. | సువర సుమమాల | 5-00 | 0-30 |
| 14. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | భాగవతవాహిని | 3-00 | 0-25 |

ఆంధ్ర రాష్ట్రము, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

# శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134.

## పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

**A** (1) పత్రికలు  ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ. |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్. |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘానిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

B(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

( పుస్తక సూచి : 96 వ పుటలో చూడండి )

లోకవాసనలే రోగముయొక్క అభివృద్ధికి మూల కారణము, దైవవాంఛలే రోగనివారణకు తగిన ఔషధములు. రెండు కూడను వాసనలే. కాని దైవ వాసన లనునవి వేయించిన విత్తనములవంటివి. అవి మొక్కలు మొలవవు. లోకవాసన లనేవి మొలకెత్తే విత్తనముల వంటివి. ఇట్టి వాసనలు సంసారికి అధికంగా ఉంటుంటాయి. కనుక సంసారియైనవాడు తనయందు కనబడిన ఇట్టి వాసనలు క్రమ క్రమేణా తగ్గించుకోవటానికి తగిన ప్రయత్నం చెయ్యటంలో ఆధ్యాత్మిక మార్గాన్ని అవలంబించాలి. ఈ వాంఛలను దైవ మార్గమునందు ప్రవేశింప చేసినపుడు అదే మోక్షమునకు సరియైన మార్గమునుకూడ అందిస్తుంది. మనస్సు చాలా చమత్కారమైనటువంటిది. మనస్సును వినియోగ పెట్టుకొనే విధానము చాల సూక్ష్మమైనటువంటిది. మనస్సుయొక్క తత్త్వము కత్తులతో చెల్లాటము, నిప్పులపైన ఆటలు. అదియే, కొంత అజాగ్రత్తకు మనము గురియైనప్పుడు మనలను సంసారములో ముంచివేస్తుంది. లోకవాసనలు పొదలలోని పులులవలె పొంచి చూస్తుంటాయి. సాధ్యమైనంత వరకు ఈ ప్రపంచ వాసనలకు మనము లొంగకుండా చూసుకోవటానికి ప్రయత్నం చేయాలి.

—బాబా